529 5 29

Reg. No. 757

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరు.

28 APR 1939



| సంపుటము | | సంచిక |
|---|---|---|
| 31 | 1939 సం॥ ఏప్రిల్ నెల | 1 |



## విషయములు.




చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaruvyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణి ఆదిలక్ష్మీదేవమ్మ బహాదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు, హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యానృసింహభారతీ స్వాములవారు, పుష్పగిరి.

3 ఇనిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు – ఆత్మకూరు.

౪ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౫ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౬ రాజా సురభి వెంకటరత్నాంబ బహాదరుగారు, రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౭ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౮ రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

## పోషకులు.

౧ వాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

3 రాజా కందుకూరు బలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు – దేవిడి

౪ రాయప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసు సర్కిలిన్‌స్పెక్టరు, గూడూరు

౫ కొండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బఘవాపురము.

౬ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇసునూరు.




# అభినవసరస్వతి

సంపుటము ౩౧ } శ్రీప్రమాథి సంవత్సరము చైత్రమాసము. { ౧

## —• కృతివిమర్శము •—

గోపికారహస్యము :— నిర్వచనైకాశ్వాసము. గ్రంథకర్త యెల్లాప్రగడ శ్రీకృష్ణమూర్తిగారు. వెల 0-6-0. గోపికలు కృష్ణుని కేవల మోహాంధలై కూడలేదనియు నీయుభయులకును బూర్వజన్మసంబంధ ముండుటం జేసియే కూడిక కల్గిన దనియుం దగు దృష్టాంతములతో సమర్థించి యది యందఱకును దెలియని గూఢవిషయము గనుక గోపికా రహస్యమని యీగ్రంథమునకుఁ బేరు పెట్టఁబడియెను. గ్రంథకర్తయే యిది యపూర్వప్రయత్నమని వ్రాసియున్నవాఁడు. కావున నపూర్వమన్నన మున్నగు వ్యాకరణదోషములు పాటింపవలసినవి కావు. క్రైస్తవులు కృష్ణుని క్రీడా...మర్మము నెఱుంగక ... నిందావాక్యముల ... వ్రాసి ... యాథార్థ్యము ...దెలియరాకుండ నొనర్చియున్నారనియు నట్లే మునల్మానులుగూడ ... నిందించి యున్నారనియు భారతీయార్యసామాజికులు ... నిందించి ... యోగీశ్వరేశ్వరుని యవతారమునకు లోపములనే సమకూర్చియున్నారనియు నిట్టిపరిస్థితులతో మునిఁగి తేలుచున్న భరతవర్షమున ... నీకావ్య మొక రత్నదీపమై కృష్ణుని కాంతిని వెలిఁగించు...చున్నదనుట నిస్సంశయమనియు నీఁబడిన రాయప్రోలు వెంకటరామసోమయాజులుగారి యభిప్రాయ మమూల్యమై యీగ్రంథరహస్యమును వెల్లడించుచున్నది. ఈకవి మునికుదురు గ్రామవాసి యెల్లాప్రగడ రామకోటయ్యగారి మూడవకుమారుఁడు. భారద్వాజగోత్రము. ఆఱువేలనియోగి. దిగువపద్యముం దిలకించి కవితాకమనీయత కనుఁగొందురుగాక.

క. లీలామానుషవిగ్రహుఁ డాలలనాజనము గూడి యస్ఖలితవిధిన్
హేలాగతిఁ గ్రీడించుచు లీలలఁ దాఁ దేలి యొప్పె లీలాత్ముండై.

దండకపంచకము:— వీరభద్ర నృసింహ లక్ష్మీ హనుమత్కాళికలను గూర్చిన యైదు దండకములు నిం దలరారెడిని. ఇది గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా గురిజాల గ్రామవాసుఁడగు పిన్నెలి నరసింహకవిచే రచింపఁబడినది. వెల 0-2-0 ఇందు దండకపంచకమే కాక శిష్టరక్షణరంహ లక్ష్మీనృసింహ యను మకుటముతో వ్రాయఁబడిన మట్టపల్లి నృసింహస్వామిమీఁది పద్యపంచకముగూడఁ బరఁగెడి. దండకములలోఁ దత్తద్దేవతావర్ణనము తగువిధముగాఁ జేయఁబడినది.

---

## —• నవనాగరికులు •—

(గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు - గద్వాలసంస్థానపండితులు)

తే. హిందుమతమన రోయుచు నింగిలీషు
వేషభాషలతో విఱ్ఱవీఁగి తిరిగి

స్త్రీలు పురుషులు వీధులఁ దిరుగు టొకటె
కాని చేకూర దొక్క యోగాని గాని.

సీ. పురుషులు స్త్రీలును దిరుగు టేర్పడెఁ గాని
దొరల మంత్రాంగంబు దొరకదయ్యె.
క్రాపులుఁ డోపీలు గల్గు టేర్పడెఁ గాని
హూణరాజ్యాంగమే మొదవదయ్యె.
ఆంగ్లభాషను మాటలాడనయ్యెనుగాని
వారివ్యాపార మేర్పడనిదయ్యెఁ
సిగరెట్లఁ దిండ్ల బైస్కిళ్ళ నెన్నుటకాని
వలయుసొమ్మన స్వప్నవార్తయయ్యె.
ప్రబలసామ్రాజ్య మొనఁగూర్పఁ బ్రాలుమాలి
చెడు విడాకులచట్టంబు లడుగుటయ్యె.
వ్రతము చెడ సుఖమూ లేదు. పతితు లగుచు
కులము విడనాడినను గటా! కూడు లేదు. 2

సీ. వేషభాషలకల్మి విస్తృతసామ్రాజ్య
మగుననియొకో వీరి యాశయములు?
ఈనాము లమ్మిన నిండ్లాడిపోయిన
వర మందినటొ వీరి వాంఛితములు?
ఉద్యోగ మొదవింపకున్న నే దెట్లైన
స్రష్టలమనియొకో దృష్టిపథము?
తలిదండ్రి కులకాంత మలమలమాడిన
సౌఖ్యమే యనియొకో సైరణంబు?
ఉన్న తమసొమ్ము కాఁ జెడి యోగు లాడిచి
పరుల బానిసతనమైనఁ బడయలేక
సతిని సుతులనే చేసేత సాఁకలేక
శీల మడుగంటుటొకో విదేశీయఫలము? 3

సీ. అంపలు నాంగ్లేయు లగుచుండిరే కాని
సామ్రాజ్యము గడించు శక్తి సున్న.
ప్రతిఘనుం డాంగ్లరూపముఁ దాల్చునే కాని
ప్రోన్నతాశయముల బుద్ధి సనదు.

ఎల్లరు హూణులై యేపారుదురె కాని
ప్రాభవోద్యోగాలపట్ల నొట్టు.
ఇంద ఆంగ్లీషుతో నేపుమీఱిరి కాని
విభవగౌరవముల విధము వేఱు
(ఇంక సంకరశాసనా లిలను నిలుప)
చేతు లెత్తుట జాత్యైక్య సిద్ధియనుట
పలుసిరులు వారికే కాద సులివియెల్ల
హూంయూరే యార్యహిందూసమాజములకో ? 4

సీ. బైస్కిలు మోటరభ్యాసమైనది కాని
కొని వీరి కొసఁగఁ డేకూళగూడ.
ఎవ్వఁడో సుత నిచ్చి యిచ్చుట గల్గిన
పెట్రోలు లైసెన్సు పీడ యెటులు ?
ముంజేయిగడియారములు వలయునుగాని
పాప మేపాపు సప్లై లొనర్చు ?
హాస్తలాఘువముల నది సమకూరిన
దేని కీతఁడు టైము తెలిసికొనుట ?
బూట్లు కోట్లును బాగ సిగరేట్లు విడువఁ
జాలఁ. డొనఁగూర్చుకొన శక్తిచాల దకట !
బిచ్చమే నెవ్వ రిడరు. పైపెచ్చు సిగ్గు.
నాగరకవిద్య ! ఎంతదైన్య మిడినావె ? 5

సీ. నవనాగరక భాషణముల విజ్ఞానులై
మార్గదర్శకముల మహిమ గనిరొ ?
వివిధపదార్థైక విజ్ఞానచతురులై
కీర్తి గైకొను గ్రంథకర్త లైరొ ?
నవవిమానంబులో నౌకలో మోటర్లొ
కూర్పంపఁగల బుద్ధికుశలులైరొ ?
పలుదేశములు సూచి భరతోద్ధరణ మిద్ది
తెలియుఁడంచను జగద్విదితులైరొ ?

సంకరాభ్యాససంస్కార (శాసనముల)
ప్రాఁకులాడెడి జీవితపథ మిదొకటి
సంతరించిరి. దీనితో జన్మసిద్ధి.
అట్టితరగతి యేమతమైన నేమి ? 6

సీ. హిందువుఁడేకదా యెల్లఖండములలో
ఘనుఁడు సాత్వికమణి గాంధి గలఁడు.
ఇండియన్ గద పెద్ద. ఇంజనీయర్లలో
అగ్రణి విశ్వేశ్వరయ్య గలఁడు.
భరతపుత్త్రుఁడేకదా ప్రాపంచికతపస్వి
కోవిదుం డరవిందఘోషు గలఁడు.
ఆర్యుఁడేకద ప్రపంచాదర్శసుకవితా
మండనుం డారవీంద్రుండు గలఁడు.
ప్రముఖు లేగినవారిలోఁ బ్రకృత మున్న
వారిలో నెందఱెంద ఉన్నారో కనుఁడు.
తొలఁగినను స్వేచ్ఛమార్గంబు ద్రొక్క లేని
ఉభయతో భ్రష్టు లెందున్న నొక్క ఫలమె. 7

మ. ఇవి హంసంబులుగావు సత్పదమునం దెంతే విహరింపఁగా
అవనిం గాకులుగావు చెట్టులపయిన్ హా కావుకావంచు భు
క్తివిధానం బెటులో గడించుటకు. పైకిం గ్రిందికిన్ బాఱలే
ని వయోధర్మపరాయణుల్ నవనవోన్మేషప్రభావోదయుల్. 8

---

కేరళ రాష్ట్రవర్ణాశ్రమస్వరాజ్యసంఘమహాసభ.

జామొరిన్ రాజాగారి యుద్బోధము.

(దేవాలయప్రవేశ శాసన ధిక్కారము.)

అఖిలభారతవర్షీయ వర్ణాశ్రమ స్వరాజ్యసంఘమువారి యాజమాన్యమునఁ గేరళ దేశమందు సనాతనధర్మమహాసమ్మేళనము పాలఘాటులో ...ప్రారంభించిరి. ఇందులకుఁ గేరళదేశమునుండియు దక్షిణదేశమండలముల నుండియు 500 మంది ప్రతినిధులేతెంచిరి. 1000 మంది ప్రేక్షకులు వచ్చిరి. ఈమహాసభకు ధర్మవీర రాజా కాలికట్ జామొరిన్ గారధ్యక్షులుగా నుండిరి. వీరు రైలుస్టేషను దిగినతోడనే యపూర్వస్వాగత సన్మానంబులు జరిపి పూలమాలలచే నలంకరించి పురవీధులలో నుత్సవము మహోత్సాహముతో గావించుచు నొక మైలుకుఁ బైఁగా నుండు కమిటీహాలుకుఁ

దోడ్కొని వచ్చిరి. తర్వాతఁ గొంతతడవునకు వచ్చిన శ్రీకొల్లంగోడు రాజా గారిను సన్మానోత్సాహముతోఁదీసికొని రాఁబడిరి. శ్రుతిస్మృతి సదాచార బద్ధులై సంతకము గావించి యనుమతి పత్రములను గొన్న వారిచే సభామండపము క్రిక్కిరిసెను.

ఆ వచ్చిన ప్రతినిధులలో వీరు ముఖ్యులు- కొల్లంగోడు రాజా సి. ఐ. ఇ. యం. యల్. ఎ. రావు బహదూర్ యం. సి. కృష్ణ వర్మ రాజావారు, రావుసాహెబ్ యన్. నటేశ అయ్యరు బి. ఎ. బి. యల్., యం. సి. ఉదయవర్మరాజాగారు, పున్నత్తూరు రాజాగారు, వారిక్కుమాన్‌చారి వలియానంబూద్రిపాదు, టి. యన్. రామస్వామి అయ్యర్ బి. ఎ. బి. ఎల్. గారు, రామచంద్రశర్మ (కంజీవరం) గారు, సుబ్రహ్మణ్యయ్యర్ బి. ఎ. బి. ఎల్. (దేవకోట) గారు, యం. ఆర్. శంకరయ్యర్ (రిటైర్డు డిస్ట్రిక్టుజడ్జి) యు. పి. కృష్ణమాచార్యులు (కాశీ) గారు మున్నగువారు. వీరు గాక యొక వందమందికిఁ బైఁగా నంబూద్రివారు ప్రతినిధులుగా వచ్చిరి.

పిమ్మట శ్రీ కొల్లంగోడు రాజాగారు సభాప్రారంభమహోత్సవము గావించుచు సనాతన ధర్మీయులకు మిక్కిలి సంకటదశ వచ్చియున్నదనియు దేవాలయ ప్రవేశ వ్యతిరేకముగా 4000 మంది సంతకములు చేసి మద్రాసు గవర్నరుగారికిఁ బంపియుండినను శాసనమైనదనియుఁ బ్రస్తుతకర్తవ్యమేదో నిర్ణయించి యాచరణమున కతిశీఘ్రముగాఁ దీసికొనివచ్చి ధర్మరక్షణము గావింపవలసిన బాధ్యత నీజామెరిన్ రాజాగారి యధ్వర్యుల క్రింద నడచు మహాసభ వహింపవలసి యుండుననియు మన మందఱ మిందులకు సర్వ విధములఁ దోడుపడవలసియున్నదనియు మున్నగు సంగతులతో నద్భుతోపన్యాసము గావించిరి.

అనంతరమునం దాహ్వాన సంఘాధ్యక్షులగు శ్రీ కోమన్ నాయర్ బి.ఏ.బి.ఎల్. గారు ప్రస్తుతమున మన కాంగ్రెసువారు మతాచార విషయములలోఁ బ్రవేశించి మిక్కిలి చులకనగా మతసంస్కార విషయములను జూచుచు శాసనంబులం గావించి బాధించు సంగతిని మహారాజులు పండితులు ప్రజలు సర్వవర్ణస్థులు ధర్మరక్షణైకోద్దేశముతో సంక్షోభవింపవలసిన కాలమిదెయే యనియు వీరు“ఎవరికివారే యమునాతీరే”అనునట్లుండిన హిందుత్వముగూడ నాశనమగుననియు మున్నగు సంగతులతో నుపన్యాసము గావించి శ్రీ జామెరిన్ రాజాగారి నధ్యక్షులుగా నుండఁగోరిరి. తరువాత నటేశయ్యర్ శంకరయ్యర్ గార్లు బలపఱచినమీఁద శ్రీ కాలికట్ జామెరిన్ రాజాగారగ్రాసన మధిష్ఠించి మహోపన్యాసము గావించిరి. వీరు తమ యుపన్యాసమునందు ధర్మరక్షణైక దీక్షా బద్ధకంకణులగు తమ పూర్వుల మార్గము ననుసరించి తాననారోగ్యదశయం దున్నను నధ్యక్షపదవి కనర్హుఁడైనను ధర్మరతితో నంగీకరించితిననియు దేవాలయ నిర్మాణాదులను గుఱించియు వాని విధులఁగూర్చియు వీనికి హాని గలుగునట్లు మన కాంగ్రెసు ప్రభుత్వమువారు గావింపెడి చట్టమును గూర్చియు ధార్మిక చక్రవర్తి కొచ్చిన్ మహారాజావారు దేవాలయముల నెంత భక్తిశ్రద్ధలతో మేరుధీరత్వమున భ్రష్టముగాకుండఁ గాపాడి ధర్మరక్షణ మెంతప్రశంసనీయముగాఁ జేసిన సంగతియు నింక ననేక విషయంబులను వ్యక్తీకరించిరి. మఱియు నీదేవాలయ ప్రవేశ శాసనము గుఱించిన వ్యవహారమును మన మందఱ మొకటిగాఁ జేరి పరస్పర సాహాయ్య

మెందుమ వ్యావహారికముగా ప్రీవికౌన్సిలు వఱకుఁగూడఁ బోయి పరిష్కారము గావించుకొనవలసియున్నదనియు నుద్ఘోషించిరి.

పిమ్మట మహాసభ జయమును గోరుచు భారతదేశమందలి యన్నిప్రాంతముల నుండి పంపిన టెలిగ్రాములను లేఖలను 150 పైఁగానున్న ముఖ్యములగువానిని సభా కార్యదర్శిగారు చదివిరి.

ఈసభ కంగముగా సనాతన ధర్మీయ విద్వత్పరిషత్తు జరుపఁబడెను. దక్షిణదేశీయ పండితులు చాలమంది వచ్చిరి. చర్చించిరి. శారదాక్టు దేవాలయప్రవేశశాసనము, వివాహ విచ్ఛేదపు బిల్లు మున్నగువానిని శాస్త్రీయముగా ఖండించి ప్రభుత్వమువారు కట్టివి తగవని తీర్మానించిరి. ఈపరిషత్తుకు బ్రహ్మశ్రీ వక్కాంచేరి వళియనంబూద్రిపాదు గా రధ్యక్షత వహించిరి. కొచ్చిన్ సంస్థానము నుండి వచ్చిన మహాపండితులగు సజ్జనతిలకం చెన్నమంగలం శాస్త్రులవారు పరిషత్తును ప్రారంభించి దివ్యోపన్యాసము గావించిరి. పాలఘాటు నివాసులును పండితవరేణ్యులునగు బ్ర. వేదాంత విశారద, అంటి శాస్త్రి గారు స్వాగతోపన్యాసము గంభీరముగాఁ జేసిరి.

తిరువడ మరుదూరునుండి హిందూధర్మవీరదళ మొకటి యేతెంచి [illegible] మొనర్చెను. ఈదళమున కధ్యక్షులు బ్ర. ఎ. కుప్పుస్వామి అయ్యర్ గారు. ఈ ధర్మవీర దళము మలబారు దేవాలయ ప్రవేశశాసనమునకు వ్యతిరేకప్రచారము గావించుచున్నది. ఇందు యం. యస్. శంకరయ్యర్ బి ఎ, బి. యల్., గారిచే హనుమద్ధ్వజ మహోత్సవము గావింపఁబడెను. జయజయధ్వానములతో సభ ముగింపఁబడెను.

పురవాసు లందఱు దుదినాఁడు సనాతనధర్మవీరులకు నతిథులకుఁ బండితులకు నాయకులకుఁ జక్కని సత్కారంబులం గావించిరి. (కల్పవల్లి.)

---

## ఆర్యధర్మధనస్వత్వమహావిప్లవము.

(పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు.)

సంస్కరణమను పదము బాగుపఱచు దాని యందే వర్తించునని పాణిని "సంపరిభ్యాం కరోతౌ భూషణే" అను సూత్రముచే నిరూపించెను. తప్పొప్పులును బాగోగులును మానవ బుద్ధి నిర్వచనీయము లనునెడ నాబుద్ధు లనంతములు, నవ్యవస్థితములు ననుక్షణ విలక్షణ కల్పకములు నగుటచే నవ్యవస్థాదోషశస్త్రములై వినిగమకము లేక సుందోపసుందన్యాయ సంక్రమణమున లోక వ్యవహార సాధకములుగాక బాధకము లగుటచే శాస్త్రమునే యాధారపఱచుకొని నిర్వచించవలెనని "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" అనువచనముచేతను శ్రీ భగవంతుఁడు గీతలలో నొక్కి వక్కాణించుచున్నాఁడు. కాఁబట్టి యే మతస్థులకైనను దమతమ మత గ్రంథములే వానిని నిరూపించుట కాధారము లగుటచే సంస్కర్తలమనుకొను నాధునికులు హిందువుల మనుచుండుటచే హిందూమత గ్రంథములచే వానిని నిరూపించవలసి యుంటను వారిచే నిర్దేశించఁబడుచున్న సంస్కరణాభాసము లన్నియు స్వమత గ్రంథ విరుద్ధములై యిహపరలోక సుఖభ్రంశకములుగాను వివిధదుఃఖప్రాపకములుగాను నిర్ణ

యుంచఁబడియుంట నీసంస్కారణములు సంకరణములే యనవలసి వచ్చుచున్నవి. కనుక "సంకరో నరకాయైవ" అనువాక్యమే యిట వర్తించుచున్నది. అందువలన మ్లేచ్ఛ బంధువగు కలిచేఁ బ్రివర్తితములై కలి భృత్యులచే శిరసావహించఁబడి యాచరింపఁ బడుచు నాచరింపఁజేయఁబడనుద్యమించఁబడుచున్న యీ మత రాజకీయ సంకరణము లార్యులకు స్వరూపభ్రంశకములై స్వీయ సర్వస్వమూలోచ్ఛేదనమునకే కారణము లగును. ఈ ప్రపంచమంతయు నిలువఁబడుటకు ధర్మమే మూలకారణమని "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" అను శ్రుతి యుద్ఘోషించుచున్నది. అధర్మమే జగన్నాశక కారణమని

శ్లో॥ "అధర్మేణైధతే తావ త్తతో భద్రాణి పశ్యతి
తత స్సపత్నాన్ జయతి సమూలస్తు వినశ్యతి."

ఇత్యాద్యార్య వచనము లుద్ఘోషించుచున్నవి. ఇట్టి స్థితిలో లోకము నందలి వివిధ మతాంతరస్థులును దమ మతధర్మముల నెట్లు రక్షించుకొనుటకుఁ బాటుపడు చున్నారో తమ కంటఁ జూచుచుండియు మతాంతర మహామోహకామిలాక్రాంత దృష్టు లగుటచేఁగాబోలుఁ బరమపవిత్రములై యుభయసుఖాధాయకములై తనరారు స్వమతధర్మములు విపరీతముగ భాసించుటయు వానిని నిర్మూలించుట కహర్నిశముగ వీరు పాడుపడుటయుఁ జూడ "వినాశకాలే విపరీతబుద్ధిః" అను నార్యోక్తి స్మరణకు వచ్చుచున్నది. పోనిండు తమకట్టి మోహమున్నచోఁ దా మట్లాచరించి దాని ఫలము నొందవచ్చును. కాని స్వధర్మపరులగు నార్యుల నెల్లర మతభ్రష్టులఁ జేయఁబూనుట "తాఁజెడ్డ కోతి వనమెల్లఁజెఱచె" నన్నట్లు చేయుట కాదా? సర్వస్వాతంత్ర్యము లను సంపాదించి ధర్మరాజ్యమును స్థాపింపఁ బాటుపడుచున్నామని చెప్పుచు మతా చార స్వాతంత్ర్యమును గూడ నూడఁబెఱుకుచున్న వీరి విజ్ఞానము విపరీత జ్ఞాన మగు చున్నందులకు, విచారింపని విజ్ఞుఁడుండునా? అయ్యయో! ఏ మ్లేచ్ఛ మత మహా మోహాసురాపానము స్వస్వరూప జ్ఞానమునుగూడ నశింపఁజేసి యిట్లు తెయితక్క లాడించు చున్నదో యా మ్లేచ్ఛమతస్థుల స్వమత రక్షణాసక్తినిగూడ నది గననీయుట లేదా? ఆర్య ధర్మ భూమియగు నీభారత భూమి నెందఱు పాలించి యుండలేదు? అందులో ధర్మరక్షకు లెట్టి ఫలముఁ జెందిరో ధర్మనాశకు లెట్టిఫలముం జెందిరో యెఱుంగరా? మా యుగమగుటచే మా సంస్కారణము లవ్యాహతములై సాగునందు రా? ఈ కలిలోనే యిట్టులే వెనుక బౌద్ధాది దుర్మతములు వ్యాపించి ధర్మచ్యుతిం గలుగ జేసినపు డెట్టులో యౌరంగజీబు ధర్మ దేవతపై నిర్బంధ పద్ధతిని దండెత్తినపు డెట్టులో యట్టులే యిపుడు నగును. కాని యిపుడే యట్టి గతి పట్టవనియుఁ బట్టినచోఁ గల్కిమూర్తి యిప్పుడే యవతరించి నిర్మూలించుననియు నేల యూహింపరాదు? పూర్వముఁబూర్వదేవతలు దేవతలకు సహజశత్రువులుగా నేర్పడి స్వర్గాది భోగలాల సులై స్వారాజ్యకాములై వానిని సాధించుటకుఁ దామను భక్తిని విధి రుద్రాది దేవతలను వేదశాస్త్ర విశ్వాసముతో వానియందలి విధుల ననుసరించి యుపాసించి వారియనుగ్ర హమున లోకోత్తరశక్తుల నంది స్వాభీష్టములను సాధించిరి. కాని యిప్పటి కలిభృ త్యులవలె విలక్షణ నాస్తికులై వేదశాస్త్రములను నిర్మూలింపఁజేసి స్వావిగ్రహారాధన

ముతో సర్వధర్మవిచ్ఛేదనముతో స్వచ్ఛంద వృత్తిని స్వార్థములను సాధించుటకు యత్నించి నటుల వినము. ఎవరి మతములయందలి మహామోహమున స్వమత నిర్మూలనమునకే యార్యాభాసులు యత్నించుచుండిరో యట్టి మ్లేచ్ఛులైనను మ్లేచ్ఛ ప్రియుఁడగు తమ ప్రభునైన కలిపురుషుఁడైనను వేలకొలది వత్సరములు విష్ణువు నారాధించియే యుగాధిపత్యాదుల నొందిరని భవిష్య పురాణాదులలోఁ గనుచున్నాము. కాని విష్ణ్వాదిదేవతలఁ జండాలాది ద్వారమున వెడలనడిపి చండాల సేవాదుల వలన స్వార్థసిద్ధి నొందినట్లు వినము. కనుక నెపుడైన నేమానవుడైన "ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః" అను నార్యోక్తిని దమచే నశింపఁజేయఁబడినచో నాశితధర్మమే తమను నశింపఁజేయుననియుఁ దమచే రక్షింపఁబడినచో నా రక్షిత ధర్మమే తమను రక్షించుననియుఁ దెలిసికొనుట వివేకము. ప్రపంచ ముదయించినది మొదలు నేఁటివఱకార్య దేశమున ధర్మనాశకు లెవ్వరును దత్కాలమునఁగొంచెము రెపరెపలాడినను దుదకు దానివలన వృద్ధిఁబొందకుంటయే కాక నిర్మూలనము నొందినట్లులే వినుచున్నాము. ఇట్టి స్థితిలో నిప్పటి యీ కలిదాసులవలనను వీరి విభుపగు కలిచక్రవర్తి వలనను స్వాధీన మొనర్చుకొనఁబడిన సాంఘిక రాజకీయ సంస్కరణాభాససంకరణ విషవృక్షారామములనుండి వీచుచున్న విషవాయువుల యావరణములచేతను గలిదాసాక్రాంత శాసనసభాయుధనిర్మాణాగారములనుండి వచ్చి పడుచున్న దుశ్శాసనాస్త్ర పరంపరలచే మన కర్మభూమియగు నీ భారత భూమినున్న యార్యసంఘములయందు వర్ణసాంకర్యము నాశ్రమసాంకర్యము ధర్మసాంకర్యము నాచారసాంకర్యము వృత్తిసాంకర్యము జాతిసాంకర్యము మతసాంకర్యము మానసాంకర్యము ధన సాంకర్యము వేష సాంకర్యము భాషా సాంకర్యము రూప సాంకర్యము గుణ సాంకర్యము విద్యా సాంకర్యము కర్మ సాంకర్యము నాహార సాంకర్యము విహార సాంకర్యము కుల సాంకర్యము జన్మ సాంకర్యము రాజ్యాంగ సాంకర్యము స్వత్వ సాంకర్యము మున్నగు కలిసాంకర్యము లన్నియును మ్లేచ్ఛ దేశముల యాదర్శముతో నేర్పడినవి.

దుశ్శాసన రాజవ్రణముల యందలి విషకీటకములు ధర్మదేవతయొక్క వివాహాది ధర్మధాతువులను భక్షించుచున్నవి. అస్పృశ్యతా నివారణమునఁ జండాల సంసర్గమేర్పడి యార్యుల స్వరూపములను మార్చివైచి చండాలత్వము నాపాదించుచున్నది. స్థిరచర ద్రవ్యము లన్నియు నన్నివిధముల నెగిరిపోవుచున్నవి. న్యాయశాస్త్ర నిర్ణీతములగు ధర్మ ధనాదుల యందలి హక్కు లన్నియు నిర్మూలించఁబడుచున్నవి. స్వైరచారమునఁ గులస్త్రీలు గూల్చఁ బడుచున్నారు. మ్లేచ్ఛ తాదాత్మ్య మార్యుల కంతటను గోచరించుచున్నది. ఇట్టి యీ మహావిప్లవ దశలో నౌదాసీన్యమును వహించి దీర్ఘనిద్రఁ జెంది రాజవ్రణాది బాధలచే మెలఁకువఁ జెంది లోకమువంకఁ గండ్లు నులిమికొనుచుఁ జూచుచు లేవలేక దిక్కులు సూచుచున్న ధార్మికుల యొక్కయు ధనికుల యొక్కయు "విప్లవము విప్లవము కర్తవ్యమేమి? కర్తవ్యమేమి?" అను హాహాకారాక్రందనధ్వను లంతటను మాఱుమ్రోఁగుచున్నవి. ప్రచ్ఛన్న శత్రువులగు నార్యాభాసుల వల్ల నేర్పడిన యిమ్మహా విప్లవమున నాత్మరక్షణమున కార్యు లుద్ఘోషించుచున్నారు. వీరి యుద్ఘోషములను విని యేమైనఁ దమ కార్యముల కెదురేగుదురేమోయని యా

హించి తన భృత్యవర్గములోఁ గొందఱకు సోదరపదము నిడి విప్లవకారుల కన్నివిధములఁ దోడ్పడుచు మఱికొంద ఱనేక నామములతోఁ బ్రోత్సహించుచు మహా విప్లవము ననేక విధముల నభివృద్ధిఁజేయ నుంకించు చున్నాఁడు. ఇట్టి దశలోఁగూడ నింక నజగర వృత్తిఁ బూని గాఢనిద్రఁ జెందుచున్న ధార్మికులును ధనికులును స్వారాజ్య మహామోహ మదమత్తులై మెలంగుచుఁ గదలిక లేక యున్నవారు లేకపోలేదు. తమకు సర్వవిధముల దీర్ఘ నిద్రయే ప్రాప్తించనుండ దురాశాదూతికా విలాసములను స్వప్నములలోఁ గనుచు గగనవీధిని మనోరాజ్యము నేలుచు నర్థ కామ సమూహ గంధర్వ నగర రాజ సౌధోపరిభాగమున దీర్ఘముగ నిచ్ఛ్వసించుచు నిద్రాదేవత నత్యంతాదరముతోఁ జతుష్షష్ట్యుపచారములచేత నుపాసించుచున్నారు. ఆహా! ప్రపంచచరిత్ర మెంత చిత్రముగ నున్నదో కదా! చిత్రమేమి? అల్పమేధావులగు మానవు లేకుక్క కూఁతలనో యేనక్క కూఁతలనో కృత్రిమభూమికలను గ్రహించి కూయుచుండ వానిని లక్షలకు లక్షలు వెచ్చించి యీ సమాజములవారు శబ్దగ్రహణ యంత్రములచే గ్రహించి యంత్రముల ద్వారమున వానిని బ్రదర్శించుటయుఁ గోట్లు వెచ్చించి సామాజికులు వాని ననుభవించి తృప్తిఁజెందుటయుఁ బ్రత్యక్షముగఁ జూచుచున్న మనకు జగన్నాటక సూత్రధారుఁడగు పరమపురుషుఁడు బ్రకృతినటితో మహామాయా యవనికాంతరమున నిఖిల భువనరంగములను మహామోహ యంత్రద్వారమున వివిధప్రాణుల విచిత్ర గతులను వివిధ స్థావర విలాసముల సీనులతోఁగూడ వివిధనటనములను బ్రదర్శించుచుండ నిట్టి యత్యల్ప విషయములలో నాశ్చర్యమా! ధార్మిక ధనిక మహోదయులారా! ఇప్పటికైనను మిమ్మావరించిన యౌదాసీన్య మహాపిశాచము విడనాడుటలేదా? మీ యనేకత్వ క్లీబత్వాదులు మిమ్ము విడనాడవా? మీమహామోహమదము మీకు సర్వస్వాహరణవిప్లవ కాలమునఁగూడ దిగదా? మీయార్యత యనార్యత నొందుచుండ మీమతమానములు మంటఁగలియుచుండ మీ హక్కులన్నియు నక్కల పాలగుచుండ మీ దేవతలు దివి కేగుచుండ దిక్కులఁజూచుచు బిక్కమొగములతోఁ గలికి మ్రొక్కులిడుచు శత్రువుల వెక్కిరింపు ముక్కల కక్కజపడుచుఁ జిక్కుల నాలోచించక పెక్కు పెడత్రోవలఁ ద్రొక్కుచు నిక్కమరయలేక మక్కువల నుక్కడఁగించ లేక కక్కురితి నొక్కుమ్మడి దిగఁద్రొక్క లేక చెక్కు చెదరక కర్తవ్యములఁ జక్కఁజేయలేక యొక్కవకాలమిట్టు లుక్కిరిబిక్కిరి సెందుచు నుండుట యెక్కడివివేకమో ముక్కులఁజూడ్కుల నిడి యొక్కమాఱు యోచించు కొనుఁడు. లోహములలోనికెల్ల సువర్ణమువలె మతములలోనికెల్ల ధార్యమగు నటుల శ్రీభగవంతునిచే వేదముల ద్వారమున నేర్పఱుపఁబడిన మన యార్యమతము సృష్ట్యాదినుండి యిప్పటివఱ కెందఱనార్యు లిందుపై దండు విడిసినను దత్కాలమునఁగొలఁది గ్లాని నొందుచు వచ్చినను వెనువెంటనే శ్రీభగవదనుగ్రహమున సురక్షిత మగుచు నా యనార్యుల నిర్మూలనమునకే నిదానమై నేటివఱ కీయార్యదేశమున నివసించఁగలిగినదని మనపూర్వ చరిత్రలు చాటుచుండుటలేదా? ఇప్పటివఱకును గలి యెంత యత్నించినను బాలుఁడగుటచే ముప్పది యొక్క వేయి వత్సరముల వయసు వచ్చువఱకు నాతని యాటపాటలు సాగక నసంకీర్ణులుగా నున్న యార్యు లెన్ని కోట్లు లేరు? ఎందఱు ధర్మదేవత నుద్ధరించఁగల మహాపతివ్రతలు లేరు? ఎందఱు

లోకోద్ధరణ సమర్థులగు ధార్మిక మహోదయులు లేరు? వీరిని రక్షించఁగల సర్వశక్తులు గల దేవతలు దేశమున దేవళములలో నిజ తేజస్సుతోఁ బ్రకాశించుచు నిప్పటికిలేరు? స్వీయరక్తనాళములలో నెట్టిసాంకర్యము నొందని యార్ష రక్తము ప్రవహించుచున్న యార్యచూడామణులు లేరు? కాని యెట్టివారికైనఁ గాలకృత మోహ మొకింత కాల మాక్రమించకుండ నుండదు గావున నింతవఱ కుదాసీనత యేర్పడినను, ఇపుడా మోహనాస్త్ర స్వరూప మావిషతరువుల దుర్గుణములు బయలు పడి నందున నిఁక నూరకుండ రని మానమ్మకము. సాధారణముగ నొక్క సాధువుని బాధయే కులక్షయ హేతు వగుచుండ సర్వసాధుసమూహసంతతబాధ కలిభృత్యుల కులక్షయ కారణమగుటలో సందియమేమి? పూర్వ మొక్క పరీక్షిత్తే కలి నిగ్రహముఁ జేయలేదా? దుర్జన మూర్ధన్యుఁడై ప్రభుత్వ మదమున ధర్మనిర్మూలనమున కుపక్రమించిన వేనుని యాయుధ గంధము లేని సప్తమహర్షులు మథించి ధర్మరక్షణమునకుఁ బృథువును బుట్టింపలేదా? అస్త్రశస్త్ర బలమున దృప్తుఁడైన విశ్వామిత్రుని బలమునంతయు నొక్క బ్రహ్మదండమున హరించి వసిష్ఠుఁడు విశ్వామిత్రుని పీఁచ మడంచలేదా? వైదిక మార్గమున ఘోర నియమములతో నత్యుగ్రతపంబొర్చి విధి రుద్రాది దేవతానుగ్రహమున నభీష్టవరముల నొంది లోకోత్తరశక్తుల నార్జించిన పుణ్యజనులు వీరుకారుగదా? ఇట్టి స్థితిలో నీకలివిప్లవ ములఁ దుదముట్టించుటకు వైదిక తాంత్రిక మార్గముల నున్న యార్యధర్మానుష్ఠానముల మూలమున ధర్మరక్షణ దీక్షితుఁడగు శ్రీభగవంతు నారాధించుటయు లౌకికమార్గమున "సంఘే శక్తిః కలౌయుగే" యనున్యాయమున ధార్మికధనికమహాజనులందఱు నొక్కుమ్మడి "పరైః పరిభవే ప్రాప్తే వయం పఞ్చోత్తరం శతం" అను ధర్మరాజ వచనాను సారము సహజముగా నేర్పడి స్వశాఖాది దురభిమానములను స్వాహంభావాదులను దూరీకరించి యైకమత్యముతో సంఘీభవించినచో నిరు రెండుకోట్ల యేఁబదిలక్షల సనాతన ధర్ములు వేల సంఖ్యలోనున్న యీపచ్చిరిఫార్మరుల నెదుర్కొని జయించుట కష్ట సాధ్యమా? కాని కలిప్రయుక్త మోహనాస్త్రకృతవ్యామోహము నేమాత్రము చెందినను సంకరణ విషవాయువు లాక్రమించకమానవు. కనుక నట్టిమోహమును దూరీకరించి యావిషవాయు స్పర్శలేకుండుటకై స్వమత స్వత్వాభిమాన దుర్భేద్య కవచములఁ దొడిగి కొని ప్రాణపణములతో నైన నాసేతుశీతాచలాచార్యుల నెదుర్కొని పోరినచో నా విషవృక్షములును వానివలన నుదయించిన యీరాజప్రణాదులును నీ కలిసభలును నిర్మూలములై ధర్మదేవత కర్మభూమిని సుస్థిరయై మంగళదేవతాసహాయముతోను మహావాణీ సహాయముతోను భారతీయులకెల్లర కన్ని సంపదలఁ జేకూర్చి సకల దేవతాపరివృతయై సకలలోకకల్యాణ దాయినియై తనరారునని మానమ్మకము. లేకున్న నితరసాధనముల నీవిప్లవము సమసిపోవదని విశ్వసించుఁడు.

---

## —♦ పురుషార్థము. ♦—

(లంకా సాంబశాస్త్రిగారు.)

పత్రికలయందును ప్రాచీనాచారములయందును దదనుయాయుల యందును నభిమానముగల తటస్థులు కొందఱు తమ తమ యాశయముల సనాతనధర్మపరులకు వ్రాయు

చుండుటను జూచి యథార్థమును వెల్లడించుట స్వధర్మమని తలఁచిన నా సాహసమును విజ్ఞులు మన్నింతురుగాక. సాధ్యైక్యము గలిగినను సాధనభిన్నతచేతఁ గర్త్రాశయములు భేదములౌచున్నవి. కాంగ్రెసు సభ్యులు శాసనోల్లంఘన మొనరించినట్లని కొందఱును బత్రికావృద్ధిచేఁ బ్రచారము చేయవలయునని కొందఱును గ్రామసంఘముల స్థాపించి ప్రచారము చేయవలెనని కొందఱును సభల జరుపుచుఁ దమకోరికలఁ బ్రభుత్వమువారికిఁ దెలుపుచుండవలెనని కొందఱును నిట్లనేకవిధముల ననేకులు వ్యాసములఁ బ్రకటించుట చూచి ఖేదమోదము లుదయించుచుండును. "ఉపాయ మన్విచ్ఛన్ యోపాయమపి విచింతయేత్" అను న్యాయానుసారము కార్యసిద్ధికొఱకు సాధనాన్వేషణము సాధనమున దోషాన్వేషణము ప్రథమము మానవునిచేఁ జేయఁదగినవి. పురుషార్థములు ధర్మార్థకామములు. పురుషార్థమనఁ బురుషునిచే సంపాదించఁదగినప్రయోజనమని యర్థము. కాంగ్రెసు నాయకులయందుఁ బలువురు ధర్మార్థకామబోధకములగు వేదశాస్త్రములఁ బ్రమాణమునుగా విశ్వసించువారు లేరు. వారలకుఁ బురుషార్థవివేచనము శంఖము పూరించినట్లే. శ్రుతి స్మృతులచే బోధితము ధర్మము, ధర్మోపార్జిత మర్థము. ధర్మార్థములచే సుపభోగార్హము కామము. ఈ త్రివర్గము మోక్షముతోఁ గూడిన చతుర్వర్గమగును. ధర్మాధర్మ నిర్ణయము మానవసాధ్యము కాదు. "అలూక్షా ధర్మకామాస్స్యుః" అని శ్రుతియు "నిత్య మద్వేషరాగిణః" అని మనువును జెప్పిరి. రాగద్వేషములు లేనివారు ధర్మాధర్మనిర్ణయము చేయనర్హులు. అర్జునుఁడు శ్రీకృష్ణభగవానుని ప్రశంసించునప్పుడు మానవమాత్రుని స్వభావము కార్పణ్యదోషోపహతమని నిశ్చయించెను. ఆ ధర్మమీశ్వరునిచేతను దత్తుల్యులగు మహర్షులచేతను నిర్ణయించఁ దగినది. మహర్షులు శ్రుతిని జూచి స్మృతులను స్మరించిరఁట. స్వకపోల కల్పితములుగావు. ఆ ధర్మము వర్ణాశ్రమానుష్ఠాతృభేదముల చేత బహువిధములుగాఁ గనుపట్టినను యథార్థముచేత నొక స్వరూపముగల యదియే. కాలము క్షణముహూర్తయామాహోరాత్రవార పక్షమాసర్త్వయన వత్సరాది భేదముచేత ననంతముగాఁ గనుపట్టినను నొకటియే. వృక్షము, పత్రశాఖాది భేదముచే భిన్నముగా నున్నను యథార్థముచే నొకటియేయైనట్లు ధర్మ మఖండస్వరూపమై ద్యుగణమును వెలిఁగింపఁజేయుచు వెలుఁగుచున్నది. ఆ ధర్మమర్థకామములఁ ద్యజించియైనను సంరక్షణీయము. ధర్మార్థ కామమోక్షములఁ బ్రథమోపార్జనీయ మేదియని యడిగిన ధర్మజుని ప్రశ్నమునకు భీమార్జునాది వాక్యము లసమంజసములని వారించి కృష్ణభగవానుఁడు విదురునిచే ధర్మము ప్రథమోపార్జనీయమనియు నర్థకామసంరక్షణము ధర్మమోక్షములచే నగుననియు నర్థకామము లాద్యంతరహితములైనచోఁ బురుషుల యింద్రియాదులను స్వాధీనపఱచుకొని విషయలోలునిగాఁ జేయుననియు బోధించెను. అట్టి ధర్మము నర్థకామములకొఱకుఁ ద్యజించిన కాంగ్రెసు నాయకులు సనాతనులకు సదృత్తులేల యగుదురు. ధర్మ మనుష్ఠానయోగ్యము. ఉపన్యాసశక్యమూ కాదు. నిర్బంధాధర్మానుష్ఠానశాసనముల శాసించుశాసనసభాసభ్యులకు ధర్మముల బోధించుట యూషరక్షేత్రముల నుత్తమబీజావాపనమగును. ధర్మము ప్రశాంతముచే సనుష్ఠేయమాత్రము. జిజ్ఞాసునకు బోధించఁదగినది. సనాతనధర్మ తత్పరులు ధర్మముకొఱకు నర్థకామములఁ ద్యజించి ధర్మదేవత నారాధించుచునే యున్నవారు. పతివ్రత వీథులవెంట బయలుదేఱి

పతిభక్తిని బోధించుట ధర్మముకాదు. పతిశుశ్రూష చేయవలెను. శత్రువులచే నిర్మించఁబడిన వ్యూహము స్వశక్త్యనుకూల కౌశలముచే భేదింపఁదగినది. సనాతనధర్మ పరులమగు మనము ధర్మసంరక్షణముకొఱకుఁ జేయు ప్రయత్నములు శ్రుతిస్మృతి విహితములై యనుష్ఠానయోగ్యములై పూర్వానుష్ఠాతృఫలదాయకములైయుండవలెను. పూర్వోక్తసాధనాన్వేషణముకొఱకుఁ పల్నాడుతాలూకా వర్ణాశ్రమ ధర్మోద్ధారకసంఘ మాంధ్రరాష్ట్రీయ పండితపరిషత్తునుగూర్చి ప్రశ్నించినది. పరిషత్తు మౌనము వహించినది. మౌనధారణమును యుగమహిమయేకాని యజ్ఞానము కాదు. అగ్నికి వాయువు సహాయమైనటుల విమత విదేశీయ ప్రభుత్వము సాయపడుచున్నది. వేదశాస్త్రముల ప్రమాణతాజ్ఞానము నశించి యప్రామాణ్యమును బోధించి విద్యాశాలలను మతదూషక గ్రంథములచే ధర్మమును బెకలించి దురాచారముల బోధింపసాగిరి. కశ్యపునకుఁ గనకాక్ష కనకకశిపులవలె విశ్రవసునకు దశాస్యాదులవలె వేద వేదాంగభూషిత బ్రాహ్మణ కుటుంబములఁ బుణ్యాజను లుదయించిరి. వా రుగ్గుబాలతోడనే విదేశీయ విద్యాచారములనుష్ఠించి తన్మయత్వము నొంది తదావేశమునఁ దత్సుఖ మితరులకు బోధింప మొదలిడిరి. పిదప గ్రంథముల వ్రాసిరి. తర్వాత నూతన సంఘ (ఆర్యబ్రహ్మ హిందు దివ్యజ్ఞాన సమాజ) ములను స్థాపించిరి. మతధర్మములఁ దెలియని వారు పలువురు చేరి యల్పసంఘములు పిదప మహాల్పసంఘములు నయ్యెను. సదాచారములు దురాచారము లయ్యెను. అంతటితోఁ దృప్తినొందక కాంగ్రెసు సంఘమునఁజేరి శాసనములఁజేయసాగిరి. విదేశీయప్రభుత్వమున నుదయించిన దుశ్శాసనములు స్వదేశీయ ప్రభుత్వముచే నడంగునని కొండంత యాశతో నున్నసనాతన ధర్మపరులకు గోరుచుట్టుపై రోకలిపోటన్నట్లు తీవ్ర శాసనములచేఁ బ్రజల బాధించసాగిరి. శాసనములచేతఁ బ్రజల బాధించుట పశుబలమని దూషించిన కాంగ్రెసువారు కఠిన శాసనములచే సనాతనుల బాధించి దురాచారముల నాచరింపఁజేయ యత్నించుట విచారకరము. సాయుధపాణి నిరాయుధుని చిత్రవధ చేసినటుల నధికారి నిరధికారుల నిరపరాధుల భూతదయాళులఁ గృతజ్ఞుల ధర్మైకదీక్షితుల బాధించుట విచారకరము.హాస్యాస్పదము. ఇది సత్యము. శారదాశాసనము కావలెనని కోరినవా రెవరు? బాల్యవివాహశాసనమవసరము కావచ్చును. ప్రౌఢావివాహము శాస్త్రముచేతను నీతిచేతను నింద్యము. ప్రజాభిప్రాయము కొఱకుఁ బ్రకటించకయే నిర్ణయించుట ప్రభుత్వవిధానమున కొక కలంకముకాక తప్పదు. శారదాశాసనము రద్దుచేయవలెనని మొఱలిడుచుండఁ దీవ్రరూపము చేయుట చాల విచారకరము. ఎవరిమేలుకొఱకు సాంఘిక శాసనముల శాసించుటయో తెలియఁజాలము. అర్థ కామ సంరక్షణము కొఱకు విమతప్రభుత్వము పాటుపడుచుండవలెఁ గాని తనకుఁ దెలియని మతధర్మముల జోక్యము కలిగించుకొనుట విచారకరము. ధర్మమోక్షముల కొఱకుఁ దమతమ మత నియమముల ప్రకారము నడచువారల శిక్షించుట హాస్యజనకము. అర్థ కామ పరతంత్రులకు ధర్మస్వరూపము గోచరించదు. మోక్షశబ్దోచ్చారణయుఁ గలుగదు. పోవుఁగాక ముక్కు మూసికొని ప్రభుత్వ విశ్వాసము గలిగి ధర్మము ననుష్ఠించు మానవుల శిక్షించుట విశ్వాసము గోలుపోవుటయే. వైదికమతసిద్ధాంతము ననుసరించి పరిపాలనా విధానము సర్వమత సర్వజన

రంజకమగును. ఈమతసిద్ధాంత మెఱుఁగని ప్రాచ్య పాశ్చాత్య దేశములు నిత్యకలహ పూరితములై సుఖలేశ మెఱుఁగక శ్రమపడుచున్నవి. పాశ్చాత్య విద్యా వ్యామోహము భారత దేశమును బాశ్చాత్య దేశమును గాఁజేయు నేమోయని సందేహము గలుగుచున్నది. భరతాది ధార్మిక ప్రభు పరిపాలిత పవిత్రధాత్రి నామరూపము లెటులమాఱునో విస్మయకరము. అటులఁగాదేని బి. దాసుగారి శారదా చట్టసవరణ బిల్లు చర్చయందు వను కూలముగా వోటు చేసినవారికి స్వర్ణాక్షరములును బ్రతికూలురకు నైల్యాక్షర లాభము గలుగుట చిత్ర చిత్రము. ఈబిల్లు శాసనసభయందు సభ్యుల వోటుతోఁ బ్యాసుచేయఁ దగినది కాదు. ప్రజల యనుమతి యెటుల నున్నదో కనుగొనుటయు ధర్మము. మత ధర్మముల మతవేత్తలను విచారించి సాంఘిక శాసనములఁ బ్యాసుచేయుట ధర్మమగును. ఇతరదేశములయందువలె మతగురువులకు సాంఘికధర్మ నిర్ణయాధికార మొసంగినఁ బరమ ధర్మము. మానవుఁడు స్వమతకన్యకనే వివాహమాడవలెఁగాని విమత కన్యను వివాహమాడఁగూడదు. భిన్నవర్తనుఁడు పదచ్యుతుఁడగునని శాసించిన పాశ్చాత్య మత సిద్ధాంతమును భారతశాసన సభాసభ్యులు మఱవకుందురుగాక. ఉదర పోషణయు మతధర్మ రక్షణయు మీఁదఁబడిన భారతీయు లుదరపోషణపరాయణులై మత ధర్మముల మఱవకుందురుగాక! మానవుఁడు కరచరణాదులు జ్ఞానేంద్రియములు, ధర్మా ధర్మనిర్ణయ చతుర బుద్ధియుఁ గలిగియు నుదరపోషణమాత్ర తత్పరుఁడైనచో విచార కరము, నింద్యము. పశు పక్ష్యాదు లనాథలై యస్వతంత్రములయ్యును నుదరపోషణయుఁ బ్రజాపాలనముఁ జేయుట లేదా? మానవుఁడు జ్ఞానముచేతను ధర్మరక్షణముచేతను నధికుఁడు. అవి లేనిచో నధముఁడు. ప్రభుప్రజా సంబంధము రెండు తెఱఁగులు. మార్జార కిశోరీయము మర్కట కిశోరీయము. మార్జారము (పిల్లి) స్వశిశువులఁ బోషించురీతిఁ బ్రభువు ప్రజలఁబోషించుట. మర్కటము (కోఁతి) స్వశిశువులఁ బోషించురీతి. మర్కటము శాఖాచంక్రమణము చేయునపు డుదరలగ్న శిశుపోషణ రక్షణలను జేసికొను రీతి. మొదటి కాలము భారతీయ పరిపాలనము తోడనే యంతరించినది. రెండవది దాపరించినది. ప్రజ లాత్మధర్మ మెఱుఁగని విమతపరిపాలనకు లోనైనపుడు స్వమత రక్షణ జాగరూకులై యాచరించుకొనవలెను. ఉదరపోషణానుకూల విద్యలతోపాటు మతసిద్ధాంతములను దెలిసికొని యాచరించుచుండవలెను. ఇదియే యాపత్కాలము. కష్టకాలము స్వమతధర్మముల విడువనివాఁ డిహపరముల నిత్యసుఖ మనుభవించును. లోలునకు సుఖములేదని సర్వమతసిద్ధాంతము. "ధర్మో రక్షతి రక్షితః"

---

—• జటప్రోలు సంస్థానప్రజ లర్పించు స్వాగత పత్రిక •—

శ్రీ శ్రీ జటప్రోలు మహారాజ్ఞిగారికి :-

తల్లీ! ధర్మకల్పవల్లీ! శ్రీవా రుత్తర హిందూస్థానయాత్ర ముగించుకొని పరివారముతో రాజనగరంబునకు వచ్చు శుభవార్త మా చెవులఁ బడినంత మా యానందమునకు మితిలేదు. శ్రీవారి కీనాఁడు స్వాగతపత్రిక సమర్పించుటకంటె వేఱొండు భా-

గ్యంబు లేదు. శ్రీవారి పావనమూర్తి యేయే పుణ్యనదీనదంబులఁ గ్రుంకులిడినదో. పాదపద్మమే యేక్షేత్రరాజముల నడయాడు భాగ్యము గాంచినదో యావిషయంబు లన్నియుఁ బూసగ్రుచ్చినట్లు వెంటవచ్చిన పరిజనంబువలనఁ దెలిసికొని ధన్యులమైతిమి.

శ్రీవారు రాజనగరమునుండి బయలుదేఱినది మొదలు తిరిగి రాజనగరము చేరుదాఁక రైలుప్రయాణ మన నెట్టిదో యెఱుంగక కేవలము మోటారులలోనే ప్రయాణము చేయుట యొక వింత. కొల్లాపుర మేడ? ఉత్తర హిందూస్థాన తీర్థము లేడ? ఎంత దవ్వోకదా? ఎంత దృఢకాయులకైనను సరాసరి మోటారులలో రమారమి రెండు మాసములు నిత్యము వందలకొలఁది మైళ్లు ప్రయాణముచేసి కష్టపడుటయన్న సాధ్యము కానివిషయము— అట్టిచో శ్రీవా రఱువదిరెండు సంవత్సరముల వయసున నింత దూరము కాలము సరిగ లేని సమయమునఁ బ్రయాణమును సాగించుట సంశ్లాఘ్యము. సంకల్పసిద్ధులుగానున్న శ్రీవారు మోటారులో 3000 మైళ్ళకు మించు ప్రయాణము నిరాఘాటముగఁ జేసి పరిజనంబులచేఁ జేయించి సుఖముగఁ జేరుటన్న ననితరసాధ్యము–

తల్లీ !

తే. ప్రభువు లొనరించు పుణ్యంబు ప్రజలకొఱకుఁ
గాన శ్రమ యను మాట లేక కననయ్యె
మాకు క్షేత్రతీరంబుల మహిమ కొంత
ధన్యతను గాంచినార మీ ధాత్రిలోన.

తే. కష్ట మొకఁడు సేయ ఫలంబు గాంచె నొకఁడ
టన్న సామెత సార్థకం బయ్యె నిపుడు
ప్రజలకై తను వర్పించు ప్రభువు లెంత
ఫలముగాంతురో చెప్పఁగా వశమె మాకు?

ఉ. మీర లొనర్చు కార్యములు మీకొఱకంచు వచించుటెట్లు? దే
శోరతిఁ బూని స్వప్రజలకై భర మెంతయు నూని సత్ప్రియ
శ్రీ రహి మీర నిచ్చలును జింతనసేయుట మే మెఱుంగమే?
వేఱుగఁ జెప్పనేటికి? లభించుత మీకుఁ జిరాయురున్నతుల్

తే. చిన్నతనమందె యల్లాప చిన్ని మన్మ
రాలు శ్రీరాజరాజేశ్వరమ్మ కరయ
నెల్లతీర్థసందర్శన మిం పెసంగఁ
గలుగఁజేసిన మీ భక్తి గణన కెక్కు.

ఉ. అంతియగాక నిచ్చటను నంచితభక్తినిఁ బాదుకొల్పి మి
మ్మెంతయు మాతృభక్తి భజియించుతనూజను శ్రీసరస్వతీ

కాంతనుగూడ వెంటఁగొని కన్నులపండువుగాఁగఁ బుణ్య మ
శ్రాంతముఁ గల్గునట్లు సుకరంబుగఁ దీర్థము లాడఁజేయరే ?

ఉ. అచ్చపు మాతృభావము లనంతములై వెలుగొందునట్లుగా
నిచ్చలు మీరలన్నఁ గడు నిష్టమెయిన్ భజియించుచుండు నే
పొచ్చెములేని ప్రేమరసముఁ గురిపించు సరస్వతీసతిన్
హెచ్చుగ సౌఖ్యసంతతుల నిచ్చి రమేశుఁడు ప్రోచుఁగావుతన్.

తే. రత్నగిరిపైన స్థాపించె రత్నలక్ష్మి
విగ్రహంబు చూపఱులకు వేడ్కఁగొలుప
వృద్ధిచేసె దేవాలయ మెంతయేని
ఎన్నఁదరమౌనె రత్నాంబ కున్నభక్తి ?

తే. కవి యటన్నను మిక్కిలి గారవించు
పండితుఁడటన్న నెంతేని భక్తిఁజూపు,
పెద్దలన్నను బూజించు వినుతిఁజేసి,
వర్ణనకు మించు రత్నాంబ భక్తి యన్న.

తే. దేవ గోబ్రాహ్మణుల ననుదినముఁ గొల్చు.
బీదసాదలఁ బోషించు నాదరమున,
ఏమి చెప్పుదు ? రత్నాంబ కెంతభక్తి
గలదొ ? సర్వసాక్షివి నీకుఁ దెలియకున్నె ?

తే. మామహారాజ్ఞి రత్నమాంబ యనినంత
ఓ పురాణపురుష ! ఒక్కచూపు నెక్కు-
డుంచితేని మ మ్మెల్ల రక్షించినట్లె.
ఇందుకై నిన్ను భజియింతు మెల్లవేళ.

ఉ. నిన్నెద సంస్మరించుటలు నీపదపద్మము గొల్చుచుండుటల్
తిన్నని వాగ్విలాసములఁ దీర్చి భవన్మహిమంబుఁ జెప్పుటల్
గన్నన నీస్వరూపమును గాంచి భజించుటలున్ మహేశ్వరా !
ఎన్నఁడుఁ జేయకుండ భజియింపదు మా రతనాంబ నిచ్చలున్.

మ. ఉదయంబందున లేచినంతటనె యత్యుత్సాహ మేపార నీ
పదపద్మంబులె సంస్మరించు నెపుడున్ భక్తిప్రభావంబు లోఁ

బోదలన్ స్నానముచేసి నీభజనమే మున్ముందుఁ జేయున్ గదా!
ఎద నూహించి యనుగ్రహింపు మిఁకఁ దండ్రీ! పాండురంగేశ్వరా!

ఉ. ఇంతకు మించి చెప్పఁగల దేదియుఁ గన్పడఁబోదు మాకు, నీ
కెంతటివార మేము వచియింపఁగ శ్రీకర! దేవదేవ! ఏ
చింతయులేని జీవితము చేకురఁజేయు మటంచుఁ గొల్తు మ
శ్రాంతము నీపదంబులను రాణికి శ్రీయుత రత్నమాంబకున్.

తే. శ్రీమహారాజ్ఞి రత్నాంబికామతల్లి
మమ్ముఁ గన్నబిడ్డలకన్న నెమ్మి మీఱ
కాంచి పోషించుఁ గృప వేయికనులఁ గాంచి
అట్టిసాధ్వికి నిమ్ము దీర్ఘాయు వంబ!

తే. ప్రథితసౌఖ్యంబు మాదు సరస్వతీమ
తల్లి కొనఁగూడుఁగావుత మెల్లవేళ
ఆపె సత్సంతానభాగ్యమున కెప్పు
డలరుఁగాత సౌభాగ్య చిరాయువులును.

తే. శ్రీజగన్నాథరాయల కోజఁదనర
ప్రాజ్యసామ్రాజ్య సౌభాగ్యభవ్యభాగ్య
ప్రథితదీర్ఘాయురారోగ్యభాగ్య మెల్లఁ
గలుగుఁగావుత శ్రీరమాకాంతు కరుణ.

ఉ. ఇందిరయన్న నామము వహించెడు మా యువరాజ్ఞి పేరునన్
పొందుగ నీకు నీడగుటఁ బొల్పెసలారఁగఁ బుత్రరత్నమున్
పొందఁగనిమ్ము భూప్రజలు మోదమునం దులతూఁగునట్లు, లా
నందము రత్నమాంబకు ఘనంబుగ నయ్యెడునట్లు శ్రీసతీ!

చ. జయమగు రాజ్యలక్ష్మికిఁ బ్రసన్నగుణాఢ్యకు రత్నమాంబకున్
జయము కుమారరాజునకు సాధ్వికి శ్రీయుత కిందిరాంబకున్
జయము నృపాలబంధుజనసంతతికిం బ్రజ కెందు నెల్లెడన్
జయము జయంబటంచు మనసా! భజియింపుము మాటిమాటికిన్.

---

# 2. ఆభరణములు.

[ఒకానొకదినంబున జగదంబగారును కృష్ణాబాయియు నీక్రిందివిధముగ సంభాషింపఁదొడఁగిరి.]

జగ:— అయితే, మనవాండ్రిన్ని ధర్మశాస్త్రములనాదికాలమునాఁడే కనిపెట్టి యీయేర్పాట్లన్నియుఁ జేసినారని తోఁచుచున్నది. కాని యీవిషయములో మాత్రము వారియేర్పాటునకుఁ గారణము నాకగపడుటలేదు. ఈకాలములో నెప్పుడు విన్నను నాడవాండ్రసొమ్ములవల్ల దేశము చెడిపోవుచున్నదనియు దేశములో జరిగెడి సగము దొంగతనాలును హత్యలును దీనివల్లనే జరుగుచున్నవనియు ననుచున్నారు. పూర్వము వివాహకాలమందు మనవారిప్పటివారివలె నిరసించినట్లు లేదు. దీని కేమి చెప్పఁగలవు?

కృ:— ఇందువిషయమై మనయుపన్యాసమంజరియందు మిక్కిలి చెప్పఁబడి యున్నది. ఎల్లకాలమును భార్య భర్తకు లోఁబడియుండవలసినదైనను వివాహకాలమందును రతిసమయమునను మాత్రము భర్తయే భార్యయొక్క యభీష్టమును గనిపెట్టి నడవవలసినవాఁడైనట్లు లోకప్రవృత్తివలనను నాదికాలమునుండి సర్వదేశములందును బ్రబలుచుండిన యాచారములవలనను విదితమగుచున్నది. లోకమునంగల జంతుజాలప్రవర్తనములం గనిపెట్టిన నది యీశ్వరసంకల్పమని ధ్రువపడుచుండును. మానవకోటియందు స్త్రీ లలంకారప్రియులనుట నిర్వివాదాంశము. ఈకారణములచే స్త్రీజనుల నలరించుటకు వివాహకాలమందుఁ గొంద ఱోలింగాని యాభరణములఁగాని యిచ్చి వారల మనోభీష్టసిద్ధినొనరించుటకీయాచార ముత్పన్నమై ప్రబలుచున్నది. ఏదియో నొకరూపమున నెల్లదేశముల నిది విధిగా జరుగుట ధ్రువపడుచున్నది. మన యాచారములవలన నిది కొంతకాలముక్రిందటినుండి నత్యావశ్యకమని తలంపవలసివచ్చినది. తఱుచుగ మనకుటుంబము లవిభక్తములుగ నుండును. కుటుంబపుటాస్తియందు స్త్రీ జనుల కింతమాత్రమును స్వాతంత్ర్యము లేదు. భాగార్హత శూన్యముగాన నీయలంకారములే స్త్రీ ధనమై యాపత్కాలంబుల నక్కఱకు రాఁగలవని యుద్దేశించి యేకక్రియాద్వ్యర్థకరీతినట్లు మనపూర్వు లీయలంకారలంకారం బొనరింప నీమధ్యకాలంబునఁ గలిగిన దేశదుస్స్థితిచే నప్పటివారు దానిం బోషించి వృద్ధిగావించుచుండిరని మనము నిశ్చయింపఁదగియున్నది. ఇప్పు డాదేశీయదుర్దశాపిశాచము వదలి మరల స్వస్థితిలోనికి రా నడుగిడుచున్నది. మనకన్నియ లందఱును బాఠశాలల కరిగి కొంచెముగనో వలయునంతగనో చదివి తెలివితేటలు గలవారగుచున్నారు. ఎవరిపేరుగల భూములు నిండ్లు మొదలగునవి వారికే తప్ప లేనిపోనికల్పనలచే నొరులు హరించు నవకాశము అడుగంటినవి. ఇందుచే నిక్కాలంబున నతివలు నిండ్లు మొదలగు స్థిరాదాయకరములగు వసతులం గలిగి తమ

యనుకూలవ్యయము లొనరించుకొనుటకును కలిగియున్నది. కావున మును పటివలె మన స్త్రీధనమున కాభరణరూపమే గతి యని యిప్పుడు దలంపరాదు. ఇప్పటివఱకును స్త్రీధన మలంకారరూపము వదలి ధనరూపమునఁగాని మఱియొకరూపమునఁగాని యుండిన నది యభివృద్ధిపఱచుటకుఁ దఱుబంధువులకడనేని భర్తయధీనముననేని వదలిన నది మరల వీరికి లంభించుట దుర్లభమగుచుండెను. సర్వవిధములఁ బట్టములకట్టుబాట్లు కలిగి దేశము సుభిక్షముగనుండి ప్రజాస్వాతంత్ర్యముతోపాటు స్త్రీస్వాతంత్ర్యమును బ్రబలుచున్న యిక్కాలంబుననే దక్షతలేని యాడువారి ద్రవ్యము నచటనచట నపహరించుట మనము వినుచున్నాము. దేశప్రజలలో నూటికిఁ దొంబదితొమ్మిదిమంది బీదవారగుట యథార్థము. అట్టిస్థితిలో నీకట్టుబాట్లు లేని మధ్యయుగమున నెట్టిచిక్కులు వాటిల్లుచుండెనో మన మూహింపఁజాలము. "కోడలిమీఁది సొమ్ము కొట్టుమీఁది చొప్పు" అను సామెత కలదు. అవసరము కలిగినప్పు డక్కఱకురాఁగలవని దీనికర్థము. ఆభరణరూపమైనప్పుడే యివి వారిశరీరమునుండి దులిచి విక్రయింపఁబడుచుండెఁగ నది భిన్నరూపమునఁ బరాధీనమైయుండినఁ గొంతకాలమైన నిలచునని తలంచుటకవకాశము లేదు. ఇదివఱలఁగనే మన స్త్రీలీఁకలుదీసినపక్షులవలెఁ గేవలము నిరాధార లగుచుండిరికద! ఇట్టిచిక్కులు కలుగకుండ నెంచియే మనపూర్వులు భర్తయాస్తికి భంగకరమగుబుణమైనను లెక్కచేయక తగురీతి నాభరణములు పెట్టించుకొనియే వివాహము లొనరించుచుండిరి. కుటుంబపుటాస్తికి ముప్పు కలిగినను దమకనాథత్వమొందవినను మన స్త్రీజాతికిఁగల యాపత్తుబలమును ధనమును మనయాభరణములేమితప్ప నితరము లేదని యెల్లరు నెఱుఁగుదురు.

శాగ:— ఇఁకనైతే మనము పట్టుపట్టి మగవాండ్రను బీడించి వీలైనంతవఱకు సొమ్ములు చేయించుకొనవలసినట్లే కనఁబడుచున్నది.

కృ:— నేను జెప్పినది మధ్యయుగమునాటి మాటలు. మన మిప్పుడు దేశకాలవ్యత్యయముల ననుసరించి సంచరింపవలసినవారమై యున్నాము. అందుకు భిన్నవర్తన మాచరించితిమేని సుఖము తొలఁగుట నిశ్చయము. శీతకాలముననే యున్నియు వహ్నియు సుఖమొసంగుఁగాని వేసంగి నవి దుస్సహములగుట యెల్లరు నెఱిఁగినయంశమే కద! అటులనే యీతత్కాలానుసరణముగ స్త్రీధనోద్దేశకల్పిత మగు నాభరణద్రవ్యమును రూపాంతరమున నభివృద్ధిగావించుకొనుచు మనమును మనకుటుంబములును సుఖము నొందుట యుచితము. ఈవిషయము నాలోచనయందుంచకుండుటచేతను గుటుంబాదాయవ్యయముల నెఱుంగకుండుటచేతను సొమ్ములు తెమ్మని మన మనేకవిధముల మగవారిని పీడించుచుందుము. ఈకారణముచే స్వర్గతుల్యసుఖముల ననుభవింపఁగల పెక్కుసంసారములు దుఃఖభాజనము లగుచున్నవి. నెలంతల బలవంతముచే బుణము లొనర్చి యాభరణములంజేయించియు వివాహాదికార్యముల వేడుకలందు

ద్రవ్యాధిక్యవ్యయ మొనర్చియు నెందఱు సంపన్నులు తమయగ్రహారములఁ గోలుపోయియు మాన్యంబు లమ్మియుఁ దుదకు నిండ్లు వాకిళ్లుం బోగొట్టుకొనియు దుస్థితికి వచ్చినది మనము వినుచుఁ గనుచున్నారము కాదె! పూర్ణముగ విచారించిన నిట్టి దురవస్థాకారకులము మనమె యగుచున్నాము. ప్రాణములకంటె బాధకరము లగుఋణముల నొనర్చి యలంకారములం జేయించి ధరించుకొని కులుకుచుండుటచే మనకుటుంబముల కిట్టి యిక్కట్టులు రాఁగలవని యెఱింగియుండిన యే స్త్రీయు నిందులకు సంతసింప నేరదు. మనజనంబులు విద్యాగంధము లేకయు న్యాయాన్యాయవిషయ మెంతమాత్ర మెఱుఁగకయు నిట్టిచిక్కులపా లగుచున్నారు. వారికోడండ్రు కైదువందల రూపాయలకంటెలు కలవనియుఁ దమకు లేవనియు విచారపడుచుండు యువతులు వారికిని దమకునుగల కుటుంబాయవ్యయతారతమ్యవివేచన మమరియుండిన స్వల్పమును గ్రహింపఁగలరు. సొమ్ములమీఁదియాస దీర్చుకొనుటచేతనే పెక్కండ్రు కుడువనుగట్టను సమృద్ధిగ లేనివారైరని చక్కగ నాలోచింపఁగల యెల్లరకును విశదముగాక పోదు. ఉల్లియు నింగువయుం దినువారికి వానివాసన పరిమళముగ నుండును. అవి యెఱుఁగనివారి కవి దుర్వాసనగఁ బరిణమించి వమనము గావించును. అటులనే మన కాబాల్యముగ నలవడిన యలంకారవాంఛ మన కొకచోఁ జేరినప్పు డాప్రసంగమునందే మనల నావేశింపఁజేసి స్త్రీజనసమూహము నెల్లఁ దదపేక్షాప్రవాహమున ముంచి ధనములకు దాసులం గావించుచున్నది. ఈగతి నెఱుంగక మనమీ సొమ్ములం దాల్చి కులుకుచున్నాము. కొంచెముగనో గొప్పగనో నేను నీయాభరణదేవతాసేవన మొనరించుచున్నదాననే కాని నాయందు మీ కాగ్రహము కలుగుట కవకాశము లేదని నమ్మి యింత నిర్భయముగ నుడువుచున్నాను. మన మిప్పు డిచ్చట నలువుర మున్నాముకద! మనయం దెవరి కెన్నివరహాల సొమ్ములు కలవో కనిపెట్టి చూడుఁడు. వెయ్యిరూపాయలసొమ్మునకు సంవత్సరమునకు నూఱురూపాయలనష్టి. అఱుగు విఱుగు తఱుగు లటుంచినను నది తప్పనిది. ఏటేట మనకుటుంబాదాయముల కీశతమును తోడ్పడుచుండిన మన మెట్టిస్థితికి రాఁగలమో యోజింపుఁడు. ఇప్పటి కెంతకాలమునుండి యీనష్టి కలుగుచున్నదో యిఁక నెంతకాలము కలుగనున్నదో యెవరికి వారు గుణించికొనిన మన దేశదారిద్ర్యమున కిది మూలకారణమని విదితము కాకమానదు. ఈపాపము మనభరతఖండమున నొప్పుగతిరలను మాత్ర మాశ్రయించి ప్రబలుచున్నదని తెలిసిన మతింతవిచారమున కాకరమగుచున్నది. ఇంతియకాక యీసొమ్ములపిచ్చి దక్షిణదేశమున వర్ధిలుచు నందు మన యాంధ్రనారీమణులం బట్టి పీడించుచున్నదనుటకు వగచుచున్నాము. మనదేశమందలి యగసాలివాండ్రు చాలక మన మలవకముసాలులను దూరప్రపనివాండ్రను వందలకొలఁది రప్పించి మనదేశవాసుల నొనర్పు

చున్నాము. ఈయాభరణపిశాచావేశము మనల బాధించుచున్నను నత్యంతర
మున జీవించు పెక్కండ్రు నీపనియందుc బ్రవేశపెట్టి పోషించుచున్నందు
లకు మనము కొంత మనశ్శాంతి నందవలసి యుండుంబోలునని యొకరు
వచించిరి. "తాను దూఱుకంత లేకున్నపుడు మెడ నొకడోలు" నన్నట్లు
మనదారిద్ర్యస్థితి కిదియెంతమాత్రమును దగనిపని, దేశాంతరస్థితిగతు లెఱిం
గినcగాని ప్రస్తుతపు మనదేశీయదుస్థితి మన మెంతమాత్రమును దెలిసికొనc
జాలము. చక్కనిశరీరమును జెక్కులాభరణములును గలవారికంటెc బరిశుభ్రత
కలశాంతమూర్తులు షోడశకళాపరిపూర్ణుcడగు రాకాసుధాకరునివలె నలరు
చుందురని మనము పలుమాఱు చదివియున్నాము. సుగుణపుంజముల కాల
వాలమగువారి శరీర మంతటను ముఖమందు నుత్పన్నమై వ్యాపించుకళా
ప్రవాహము సర్వాంగసుందరులై యమితాభరణభూషిత లగుగుణహీనల
యం దెంతమాత్రము నంకురింపcజాలదని మన మెల్లరము నెఱుcగుదుము.
యుక్తవర్తనము చేతను బరోపకారశీలత్వము చేతను జుగుప్స లేని యానందము
మనంబున నుత్పన్నమై తాండవమాడుచు ముఖవికాసమున కనన్యసామాన్య
మగువన్నె దెచ్చును. దూరాలోచనపరు లట్లుగాక పైకప్పు చేసియుంచినను
గాయములబాధ తొలcగనటుల నంతశ్శుద్ధి లేనికారణంబునc దెలిసికొన నలవి
గానికలవరము మనంబున నంకురించి ముఖవికాసము నడcచుచుండుం గావున
నట్టివా రెన్నియలంకారంబులం దగిలించుకొనినను గొయ్యబొమ్మ నలంక
రించిన ట్లందములేనివారై యింపుదొఱcగి యుందురు. సొమ్ములు నిజముగు
నలంకారములు కాcజాలవు. సొమ్ములు లేని పసిపిల్ల లనేకులు ముద్దులుమూట
గట్టి మనమనంబుల నాకర్షించుచుందురు. ఏసొమ్ములును ధరించని మహాపురు
షులు మన కందము లేనివారుగc దోcచుచున్నారా! వారలం గాంచిన మన
కుc గొఱcత లగుపడుచున్నవా? ఎంతమాత్రమును లేదు! వార లెల్లరును
సహజసౌందర్యము చేతనే యలరారుచుందురు. చెట్లcజిగుళ్ళను బూవులను
ఫలములను జూడ నెంతసొంపునిచుచుండcగలవు? వాని నెవ రలంకరించిరి?
సమస్తసృష్టివర్గమునకు నిర్మాణమునం దద్భుత మగు రమణీయత నిమిడ్చి తన
యనంతశక్తి నాయీశ్వరుcడు వ్యక్తీకరించుచున్నాcడు. మనకు నట్టివైజా
లంకారము లాభగవత్ప్రసాదముచే నొప్పారుచున్నవి. మన కనులయంద
మును జెక్కిళ్ల సొంపును గనుబొమ్మలయింపును, ఫాలభాగము కుదురును,
ముఖవికాసమును దలకట్టు మెఱుపును నేయలంకారములచే నేర్పడినవి?

చ. ముద మలరార లేనగవు మోమువయిం బావణింపఁగా వెసన్
మదవతి యంత రూపజితమన్మథునిన్ వికచాబ్జనేత్రునిన్
సదయుని జారుమస్తకుని సచ్చరితున్ ఘనపుణ్యశీలునిన్
సదమలగాత్రు నాచ్యవను సాధుజనప్రియుఁ గాంచె నయ్యెడన్.

వ. ఇట్లు సుకన్యక వయోరూపలావణ్యాతిశయంబున నెసంగు భార్గవునిం గౌఁగిలించుకొని మృదుమధురోక్తుల సరససల్లాపంబు లాడుచుఁ గొంతవడి కయ్యాశ్వినేయులం గని యో మహాత్ములారా! మీ దయాతిశయంబున నస్మద్విభుండు సురూపుండయ్యెం గావునఁ దులలేని వైభవంబులం గంటి, కృతార్థనైతినని యనేకవిధంబులఁ గొనియాడిన వారలు హర్షోత్కర్షమానసులై యాశీర్వదించి యద్దంపతుల వీడ్కొని యథేచ్ఛం జనిరి. తదనంతరంబున 48

క. మునివిభుఁ డియ్యెడ నవయౌ
వనుఁ డయ్యెం గానఁ జూడ వాంఛ జనించెన్
చనుదము వటం చమ్మలయుని
కొని చైత్రుఁడు వచ్చె నాఁగఁ గోమలతరమై. 49

క. వనసీమ చూడ నల్లెడ
ఘనపుష్పలతాకుడుంగకలితంబై యొ
ప్పెను గంధశీతలానిల
మనయము వీతెంచె నంత నతివిపులముగాన్. 50

వ. అప్పుడు 51

ఉ. కాననలక్ష్మి చెన్నలరఁ గాంతుని మాధవురాక గాంచి ప్రా
చీనవరాసికాండములఁ జీ యని రోసి నవాంశుకావళుల్
పూనెననంగఁ బాండుదళపుంజములన్ విడనాడి పల్లవా
నూనవరప్రసూనముల నూతనమైన రుచిన్ వహించుచున్. 52

సీ. కనుపట్టె నొకచెంతఁ గమనీయమైనట్టి
సారసకలహంస భూరిరవము.
చూపట్టె నొకయోర సురుచిరాబ్జస్రవ
న్మధుపానమత్తాళి మధురరవము.
పొడచూపె నొకచాయఁ బుష్పితాలంకృత
సహకారమందార సాలవితతి.
చెలువొందె నొకవంకఁ బిలుచు చెల్లర నంక
మురుమల్లి కాజాతిరుచయంబు.

వెలసె నొకపక్కి స్వర్ధునీజలజగంధ
బంధురంబగు మందంపు గంధవహము.
మొనసె నొకకడ వికసితపుండరీక
కుముదకల్హారహల్లకకువలయములు. 53

వ. అంత 54

తే. గీ. అలవసంతుండు వసరమాలలన పాణి
పీడనముసేయునెడ మది వేడు కలర
రమణు లెల్లను మంగళారతులు పాడి
రనఁగ శుకపికరవములు మొనసికొనియె. 55

క. మలయసమీరాహతిచే
ఫలసుమగణపతన మగుడు బహుళాభరణా
వళిసమలంకృతవేశ్యా
లలనామణిపగిది ధర విలాసము నొందెన్. 56

ఉ. అంత వసంతవేళఁ గమలాయతలోచనఁ గూడి మౌని తా
నెంతయు సంతసంబలర నింపగునట్టి ప్రసూనశయ్యలన్
వింతగు సైకతస్థలుల విస్ఫురిత పర్వతకందరంబులన్
భ్రాంతిదలిర్ప నూత్నసుమరంజిత చారు నికుంజసీమలన్. 57

ఉ. కూరిమి ద్రాక్షపందిరుల గొజ్జఁగినీటి వెడందవాఁగులన్
చారుతరంపు సంపెఁగల చాటులఁ గప్రపు టంటిమోకలన్
భూరికురంటకామ్రముల పొంతల బల్ నెలజాలతిన్నెలన్
సారసనేత్రిఁ గూడి సుమసాయకుక్రీడల నోలలాడుచున్. 58

సీ. తులలేని నీ కుచంబులు వట్టనిచ్చిన
తళుకుబంగరుగిండ్లు చెలిమి నిత్తు.
పూనిక నీమోవిపానకం బిచ్చిన
సొంపుసంపాదించు కెంపు లిత్తు.
నిద్దంపుఁ జెక్కుల ముద్దాడ నిచ్చిన
బాగైన వజ్రాలపలక లిత్తు
కులుకు వెంపెసలారఁ గూర్మి నన్గొన్న
కమనీయరత్నాల కమ్మ లిత్తు.

పాళిచే నన్నుఁ బూపాన్పునందు మదను
కదనమునఁ దేల్చి మఱిమఱి ముదమొసఁగి
లీల సర్వంబు నిత్తు. ఇంకేల తడవు?
బాలశశిజిత్వరఫాల! శుభాలవాల! 59

వ. అని యిట్లు 60

సీ. విడె మొసంగఁగఁబోవువిధమునఁ జైకొని
కాంత కెమ్మోవి బల్గంట్లొనర్చి
వలపుచేఁ జందన మలఁదునెపంబున
లోలాక్షి పాలిండ్లు కేలఁబట్టి
రాణనొప్పారు వడ్డాణ మంటినమాడ్కి
కమలాక్షి జఘనంబు నెమకి మిగుల
కెరలి వే వీఁసరుల్ దురిమెడుపోల్కిని
కోమలి నెఱికొప్పు గొప్పు దువ్వి
తళుకుఁజెక్కులు ముద్దాడి కలికినారు
నాభిమూలంబు నంటి తా నయమొలర్ప
మదనశాస్త్రంబురీతి నమ్మానవరుఁడు
రతులఁ గరఁగించె మఱియు నారాజముఖిని. 61

సీ. ఎద నెద గదియించి ముదము చెన్నలరార
అదరంటఁ గౌఁగిట నదిమియదిమి
మోము మోమునఁ జేర్చి ప్రేమ లేఁజెక్కుల
బిగియారఁగా ముద్దుఁ బెట్టిపెట్టి
వేడ్కచే మోవి మోవికిఁ జైనఁ దార్చి యిం
పలర సుధారసం బానియాని
మర్మంబు మర్మంబు నమ్మిలి హత్తించి
ఎనలేనికూరిమి ననఁగి పెనఁగి
కడఁగి తొడయును దొడయును గదియ నదిమి
ఉల్లములు సంతసంబున నుల్లసిల్ల
మృదుమధురవాక్యసంగతి వొదల రతుల
తీఁగఁబోఁడిని దేర్చె నద్దివ్యమౌని. 62

సీ. సతత మచ్యుతకథామృత మానువీనుల
వెలఁది తేఁబల్కులు వినఁగఁగోరు.
జలజాక్షు దివ్యతేజము గాంచు కన్నుల
సుదతి చక్కదనంబుఁ జూడ నెంచు.
నిరతము హరిసేవ వఱలు కరాబ్జము
లంగన కుచయుగం బంటఁదివురు.
అనిశము శౌరియం దనువొందు చిత్తము
సుందరి రతికేళిఁ బొందుపఱచు.
కంస (పరిపంథి) నిర్మాల్యగంధ మాన
పూను నాసిక సకియ నెమ్మోవితావి
కిచ్ఛయించును. ఇట్లు పంచేంద్రియమ్ము
లంబుజాతాక్షియందున హత్తుకొల్పె. 63

తే. గీ. అహహా! అమ్మునితల్లజుఁ డహరహంబు
నిర్జితేంద్రియుఁ డయ్యును నేరుపెడల
అతివ మాయకు లోనయ్యె. అవని నెంత
ధీరులయ్యును మరుకిందువారు గారె? 64

క. ఈవగిది మదనకదనవ్యాపారంబులను మాని వాంఛ దలిర్పన్
భూపాలసుతయుఁ దానును గాఁపురమటు సేయఁగొంత కాలము సనుడున్

వ. ప్రతిష్ఠానపురవరేణ్యంబున 66

తే. గీ. నీతికోవిదుఁడైన శర్యాతిభూమి
విభుఁడు కొలువుండి యొకనాఁడు వేడుకలర
సభ్యులను గాంచి పల్కె. ఓచతురులార!
చెప్పుఁ డుత్తమలోకంబుఁ జెందువిధము. 67

తే. గీ. అనుచు నీక్రియ నాడెడు జనవరేణ్యు
చూచి పల్కిరి వారలు చోద్యముగను
అఖిలదోషోజ్ఝితుండయి యమరలోక
వాసుఁ డగు వేగ జన్నంబుఁ జేసినతఁడు. 68

## —♦ చినప్పయ్య బావమఱఁదులు. ♦—

శ్లో. అవమానం పురస్కృత్య మానం కృత్వాతు పృష్ఠతః
స్వార్థం సముద్ధరే త్ప్రాజ్ఞః స్వార్థభ్రంశో హి మూర్ఖతా.
(భోజచరిత్ర.)

అవమానము వచ్చి యగ్రమునఁ బడనీ. మానము మంటఁగలియనీ! ప్రాజ్ఞుఁడు స్వార్థమును సమర్థించుకోవలెను. స్వార్థము జెఱచుకొనుట మూర్ఖతకదా! కనుకనే మావాఁడు మఱఁది పెండ్లికిఁగా నరియైన నన్నువచ్చి యనుకూలుఁ జేసికొనియెను. అన్వాని కైదుగురు మఱఁదులు. వారు కడుసమర్థులు. అంగబలము నర్థబలము రెండును గలిగి వీరికిని వీరికొఱకును వీఁపులమీఁద నుండును వివిధవిధముల వెఱపుదీర్చువారు. అందును రెండవమఱఁది సత్యనారాయణ మతియుఁ బ్రబలుఁడు. ఇతఁ డీనడుమ నస్మ దంగశుద్ధిఁజేయుట కంగబలము నభినవసరస్వతీప్రకటితక్రియమాణముల నాఁగుట కర్థబలము వ్యయపెట్ట యత్నించెను. అంతియే కాదు. బహిష్కరించెను. పాండుధృతరాష్ట్రచరిత్రముం బలె నేను మా తండ్రి పినతండ్రుల చరిత్ర వ్రాయఁదలపెట్టి మొట్టమొదలు తండ్రిది తత్పరంపర సాగినంతవఱకు వ్రాసి యిఁక బినతండ్రి చరిత్ర మెత్తికొంటిని. అందు ధృతరాష్ట్రసంతతివలె దుర్యోధనుఁ బలగమునం బోలె ననేక పురుషులు స్త్రీలు బయలుదేరుచున్నారు. అందుఁ బినతండ్రి రెండవకొడుకైన సుబ్బయ్య కొడుకులు నల్లుండ్రు. నడతెంచిరి. అందు రెండవకొడుకుచర్యలు వర్ణించుచోఁ బిడుగురాళ్ళ బ్రాహ్మణులంబోలెఁ గాఫీహోటలు మొదలైన కాలానుగుణ కర్మలకుం గడంగననియు సుబ్బయ్యయల్లుఁడు చేబియ్యము శివరామయ్య చరిత్రలోఁ గాఫీలు త్రాగెననియు నేమేమో త్రాఁగెననియు బావమఱఁదియైన యాసుబ్బయ్య రెండవకొమరుని పెండ్లి పేరంట్రములు నేనే చేతు నుండుమని తన ధనవత్కుటుంబపుం బనులకు బాసటగాఁ దనయింట నుంచుకొనెననియు నంటిని. ఇది తథ్యమో యతథ్యమో ధర్మమో యధర్మమో తరువాతఁ జెప్పుదునుగాని మనవారు మహాదోషముగా నెంచు మత్కృతకార్య మిది. పైన వేరె పేరు లెందుఁ బడినవో యా సత్యనారాయణ శివరామయ్య సుబ్రహ్మణ్యముగార్ల కాపత్రికలు పంపితిని. చిన్నగా నిది శిఖావర్ణమై చేబియ్యపుసోదరుల చిత్తసద్మములఁ దగుల్కొనియెను. రగుల్కొనియెను. బగ్గుమనియెను. పటువ్రణం గల వఱపఱచెను. పప్పు పట్టాభిరాముని బంధించెను. పిడుగురాళ్ళ పెదబ్రాహ్మణులఁ గొందఱఁ బెడదారికి లాగెను. నన్నమ్మనాలిబూతులు దిట్టించెను.

కొట్టింపనుగూడఁ గొంత యత్నించెను. బహిష్కారమును బ్రకటించెను. పర గ్రామములకును బత్రికలు పంపఁబ్రయత్నించెను. ఎప్పుడుచూచినను నీ చేబియ్యపు సోదరుల నిదియే యాందోళనముం దుండఁజేసెను. వేయేల? అహస్నస్తక మాకొంపల భూకంపముపుట్టినట్లే పొడకట్టెను. నల్లగొండ నిజామాబాదు మున్నగు నానాప్రదేశములంగూడ సర్వప్రతిష్ఠ సంపాదించిన సత్యనారాయణకాని తదనుయాయులుకాని

యొల్లను నెఱిఁగిన యీవిషయము కల్లయనుటకు వల్లకాక, మే మేమిచేసిన నీయన కేమనియు మావిషయము వ్రాయుట కెవఁడు వీఁడనియుఁ బిడుగురాళ్ళ బ్రాహ్మణులు కాఫీహోటలులో యసలుహోటలులో యేదో పెట్టుదురుగాక! జానపాటి బ్రాహ్మణు లేమి సామ్రాజ్య మేలుచున్నారనియు వీరుచేసిన యకృత్యము లేల వ్రాయలేదనియుఁ దాను బిచ్చమెత్తుకొనుట లేదా యనియు నేమేమో తా మనుదురు. ఎవరిసంగతియు నీయన కేలయని సజ్జనంమన్యులుఁ బండితంమన్యులుఁ దుదకుఁ బరామర్శలేని పండితులుఁ బాము రులుపాడు పాటయే పాడుదురు. పరామర్శగల పండితులో, శ్లో. కథాపిఖలు పాపానా మల మశ్రేయసే యతః యను సద్యుక్తోక్తి నగపఱతురు. అనవసర తత్కథాగానములో నయ్యుక్తి యన్వయించుట యథార్థమే కాని యిట్టి చరిత్రలేఖనమునఁ గాదు. ఇది స్వచరిత్ర. స్వచరిత్రలోను నీయది స్వీయచరిత్ర. స్వీయులు గనుకనే చేబియ్యపు సోదరుల నిందుఁ జేర్చుకొనవలసివచ్చినది. శివరామయ్య బావమఱఁది రామకృష్ణయ్యను బరిణయమొనర్తునని యే యుంచుకొనియెనో పనిపాటలు పొనరించుటకే యుంచుకొనియెనో నామఱఁదలి నన నక్కఱలేదు. జనశ్రుతి యట్లు సాగినది. అది యసత్యమైన నట్లు ప్రకటింపవలె. అట్లుకాక యింకను రెండు కల్పించుకొని నాసంగతి ప్రచురించుటకు వీఁడెవఁడని నన్నుఁ దిట్టుట చిన్నపని. మిన్నపని గాదు. మఱఁదిని గుఱిచి యన్నమాట మరల్చుకొనుపనియైనను గావలె. ఏమేమో వ్రాఁగెననిన, టీమొదలైనవని యేల యనుకొనఁగూడదు? జానపాటివారికి జామాతలై వంశానుక్రమణికలో వచ్చిపడి వర్ణితులైరి కాని చేబియ్యపుసోదరులు నిర్నిమిత్తముగా నిందింపఁబడినవారు కారు. అసత్యలేఖనమును నమ్మను నాలిని దిట్టుటయు నిందకాని యున్నది యుగ్గడించుట నింద కానే కాదు. అది యథార్థకథనము.

క. పురివరదనీరు గోదా
వరిని గలసి యోగ్యమైనవడువునఁ గడుదు
శ్చరితుండైనను గావ్యాం
తరమునఁ జెప్పఁబడి పావనచరిత్రుఁ డగుఁగా.

అని యప్పకవి చెప్పినట్లు తమపేళ్ళ నొక విద్వత్కవి గైకొని గ్రంథమునఁ జేర్చి యాచంద్రార్కస్థాయులఁ జేయుట కగ్గింపవలసినదానికి మాఱుగా నెగ్గించు నీ చేబియ్యపుసోదరుల యజ్ఞతాహమ్మతుల విజ్ఞులు విమర్శింతురుగాక. భగవదాలయములఁ బ్రవేశించి పంచములు బ్రాహ్మణుల బహిష్కరించినట్లే చేబియ్యపుసోదరులు నన్ను బహిష్కరించిరి. సిగ్గుసిగ్గు. పాపము శాంతించుఁగాక. ఇక్కడి కీపాయిప్రసంగము పరిహరించి పశ్చాద్విషయమును బరిగ్రహింతము. కసివోక మసిఁబూసికొన్నట్లు నాకు బహిష్కారము వేసితిమనియుఁ బరిసరగ్రామబ్రాహ్మణులకుఁ దెలియుటకుఁగాఁ బత్రికలు పంపితిమనియు నిట్లు చేబియ్యపుసోదరులు శివాలాడియాడి చివరకుఁ బిడుగురాళ్ళ బ్రాహ్మణు లెవ్వరును దమయిండ్ల హవ్యకవ్యములకు నన్నుఁ బిలువఁగూడదనియు నాయింటి హవ్యకవ్యములకు వారెవరును బోఁగూడదనియుఁ దీర్మానించిరఁట. ఈనిబంధనకుఁ బిడుగు

రాళ్ళబ్రాహ్మణులే కాక చేబియ్యపు సోదరులఁ బిలిచి పిల్లలనిచ్చి పెండ్లిండ్లుచేసిన జానపాటి సుబ్బయ్యగారికుటుంబమును భర్త శేషయ్య బంధమును పెంపియే చేసెనుగాని సద్బ్రాహ్మణుల సంతరించుకొను శక్తిలేని జానపాటి శశిరేఖయు బద్ధులైరఁట. మహాపద మశేమియు రాలేదు. రోగియుఁ బాలే కోరెను. వైద్యుఁడును బాలే కోరెను. ఇదివఱకే యేను పిడుగురాళ్ళ బ్రాహ్మణులఁ బిలుచుట లేదు. ఏనొక్కఁడనే కాదు. జానపాటి పురుషోత్తముగూడ. పురుషోత్తమే కాదు. మా విశ్వనాథముగూడ మామలఁదప్పఁ బురోహితులఁ బిలుచుట మానివేసినాఁడు. మాపురోహితులు చిరకాలమునుండియుఁ జేబియ్యమువారు. వాస్తవమునకుఁ బురోహితుఁడనిన గురువే. కాని యియ్యది యాశ్రితునిక్రిందికి మాఱిపోవుట యందఱు నెఱుఁగుదురు.

శ్లో. గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్.

అను నభియుక్తోక్తి యహంకారపరీతుఁడైనచో నాగురువునుగూడ శాసింపు మని యనుచున్నది. అట్టిచో నాశ్రితులై యయ్యాశ్రితధర్మము ననువర్తింపకున్న నవ్వారి నెవ్వ రాదరింతురు ?

పిడుగురాళ్ళ బ్రాహ్మణులలోని కెల్లఁ జేబియ్యమువారే శ్రాద్ధభోజనమున జానపాటి వారి కక్కఱకువచ్చువారు. తక్కుంగల తద్గ్రామ బ్రాహ్మణులు జానపాటివారే. మా వాండ్రే. వాండ్రుగాక పప్పు పట్టాభిరామయ్య యొక్కఁ డుప్పరాయివలె నున్న వాఁడు. వాస్తవమునకు వాఁడే హవ్యకవ్యముల నాహ్వానింపఁ దగినవాఁడు. అప్పుడప్పుడే మాహ్వానించుటకూడ వానినే. చేబియ్యముసోదరులు శిరస్స్ఫోటనము సేతుమను టచేఁ బాప మవ్వాఁడు భయపడి మాయింటి బ్రాహ్మణార్థమునకు రా మానుకొని నాఁడు. బ్రాహ్మణార్థమునకే కాదు. పలుకరించుటకుఁగూడ భయపడుచున్నవాఁడు. ఇట్టిభీరు విష్టుఁడైననేమి ? శిష్టుఁడైననేమి ? ఇంతకన్నను నిష్టులే శిష్టులే యెందఱో నాయింటి కేతెంచుచున్నారు. కనుక బాలుఁడై భయపడిన పప్పు పట్టాభిరామయ్యను గూర్చి పరితాపపడను గాని సపిండులైన జానపాటివారుగూడఁ జేబియ్యముసోదరు లలోఁ జేరి చిందులు ద్రొక్కుటకుమాత్రము చింతింతును. పాలకాటిపిల్లను బరిణయమా డుటమొదలగు పనులఁ బాప మా లక్ష్మీనారాయణ పాటింపక నాపండిత గౌరవమును బరిరక్షించుకొని వచ్చుచున్నాఁడఁట. వీరిద్వారముననే యేను విద్వత్కవినై విఱ్ఱవీఁగుట. బహుదూరస్థ మగుపరదేశమనియేకాని పాలకాడు పతితభూయిష్ఠము కానే కాదు. అచటి బ్రాహ్మణు లనేకులు బాలురదగ్గఱనుంచి పతితవేదశాస్త్రులై పరఁగు చుందురు. అట్టి పాలకాటిపిల్లనర్ధాంగిఁ జేసికొన్నందుల కప్పుడాక్షేపింపక క్షమించి విడిచినను బ్రకృత మాక్షేపించుటకు బయలువెడలిన పిడుగురాళ్ళ లక్ష్మీనారాయణ, బహుకాలమృతయగు ప్రథమ పాతివ్రత్యప్రస్తావము పరిత్యజించి పాలకాటిభాగ్య యొక్కయుఁ బ్రక్కయిండ్లభామల యొక్కయుఁ బాతివ్రత్యమును బరిశీలించి

మఱియు మాటలాడుఁగాక. స్త్రీరత్నం దుష్కులాదపి. దుష్కులమునుండియైనను స్త్రీరత్నమును దీసికొనవచ్చును. రమణీలోకమునకెల్ల రత్నమనఁదగినది పాతివ్రత్యము గలదియే. ఇత్యాదిధర్మసూక్ష్మముల నించుకయు విచారించక యెవ్వరిలోనో యేకీభవించిన యీ వృద్ధునిమాటలు కేమికాని యువకుఁడై యొక్కవిద్యలో నొకకొంత యోగ్యత యున్నదని యనుకొనుచున్న నాగభూషణము గూడఁ జేబియ్యపు సోదరులతోపాటు శివాలాడుట చిత్రమయ్యెడిని. మనసు కత్తిరించుచున్నవఁట మల్లిఖితము లతనికి. పిడుగురాళ్ళబ్రాహ్మణులు పెద్ద పేరుప్రతిష్ఠలతో నున్నవారని యేను మరల వ్రాయవలెను మన్నింపఁడఁట నన్ను. సంచారమునకుఁ జనినప్పు డీయన స్వగ్రామము పిడుగురాళ్ళయని చెప్పుటతోడనే తద్దయు నైచ్యము కనఁబఱతురఁట తత్రత్యులు. ఇట్లు జాతిమీఁదఁబెట్టి వ్రాయు వ్రాఁతలు జాతిలోని సర్వులకు సమన్వయించుచో

శ్లో. వేదవిక్రయకర్తారో బ్రాహ్మణా శ్శౌచవర్జితాః
స్వాధ్యాయరహితాశ్చైవ శూద్రాన్ననిరతా స్సదా
అసత్ప్రతిగ్రహాః ప్రాయో జిహ్వాలౌల్యసముత్సుకాః
పాఖండినో వికర్మస్థాః పరదారోపజీవినః.

(స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము 27 అ.)

సీ. భాషాంతరగ్రంథ పారాయణంబులే
స్వాధ్యాయపఠన ప్రసక్తిగాఁగ
దుర్దానసంగ్రహ ధూర్వాహకత్వమే
విహితమౌ సత్ప్రతిగ్రహముగాఁగ
వేదబాహ్యమత ప్రవిష్టమానసతయే
పరమేశ్వరధ్యాన పరతగాఁగ
పారదేశిక వేషభాషావలంబమే
వర్ణాశ్రమాచార వార్తగాఁగ
పరసతీద్వారముననైన బ్రదుకుదెరువె
మాన్యమైన గృహస్థధర్మంబుగాఁగ
ధారుణికి నగ్గలంబైన భారమగుచు
ఉందు రేమందుఁ గలియుగమందు ద్విజులు.

(1 అ. 982.)

అనువాని నెటుల సమన్వయించునో నాగభూషయ్య ? కలికాలబ్రాహ్మణు లందఱును దిష్టన్మాత్రులేయని యొప్పుకొనవలయుఁగదా !